నందికొండ ప్రాజెక్టుపై ఆంధ్ర ప్రభుత్వ వైఖరి: ఢిల్లీవర్గాల అభిప్రాయం

—7 వ పేజీ

# ఆంధ్రపత్రిక

వర్షాధిక్యతవల్ల గుంటూరు జిల్లాలో సంభవించిన విశేషనష్టం వివరాలు

—5 వ పేజీ

318911

THE ANDHRA PATRIKA · MADRAS. సంపుటం 41. సంచిక 183 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO బుధవారం 6-10-1954 Reg. No.M. 1118 8 పేజీలు వెల 1 అణా

# ‘శాంతియుత సమాలోచనలే కాశ్మీర్ సమస్యకు పరిష్కార మార్గం’

## అన్యసహాయాన్ని అపేక్షించడం నిరర్థకమని పాక్‌ప్రధానికి నెహ్రూ స్పష్టీకరణ

### నీటికాల్వల పాత ఒప్పందంపై మహమ్మదాలీ అసంబద్ధ ఆరోపణకు ఘాటైన జవాబు

న్యూఢిల్లీ, అక్టోబరు 4: "మీకూ, మాకూ మధ్యవున్న తగాదాలను మీరు, మేము కలసి పరిష్కరించుకోవలసిందే కాని మరొకరివల్ల ఇవి పరిష్కారం కావు. ఇవి పరిష్కారం కావడానికి ఎంతకాలమన్నా పట్టనీయండి. శాంతియుతంగా కూర్చుని మాట్లాడుకుని పరిష్కరించుకోవలసిందేనని నాకు చాలాకాలం క్రిందటనే తట్టింది. ఇప్పుడు మీకుగూడా తట్టుతుందనే అనుకుంటున్నాము," అని తమకు, పాకిస్తాన్ ప్రధానమంత్రికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో ఒక ఉత్తరంలో ప్రధానమంత్రి నెహ్రూ పాక్ ప్రధాని మహమ్మదాలీకి తెలియజేశారు.

సెప్టెంబరు 29 వ తేదీనాడు ఒక ఉత్తరం వ్రాస్తూ ప్రధాన మంత్రి నెహ్రూ "కాశ్మీర్ సమస్యను శాశ్వతంగా పరిష్కరించుకోవాలనే ఇండియా ఆదుర్దా పడుతున్నది. ఆత్రాన్ని చూపిస్తున్నది. ఇక దీన్ని పరిష్కరించుకోడానికి శాంతియుతమైన సమాలోచనలకన్నా మంచి మార్గంలేదు. మీము ఏమి వాగ్దానాలు చేశామో ఆ వాగ్దానాలన్నింటిని పాలిస్తాం" అని కూడా స్పష్టం చేశారు.

1953 జూలై మొదలు 1954 అక్టోబరు దాకా ఈ ఇద్దరిమధ్య ప్రత్యేకంగా ఈ రెండు దేశాల మధ్యవున్న అన్ని తగాదాలను గూర్చి ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. అయితే యిప్పుడు ఒక్క కాశ్మీర్ వ్యవహారాన్ని గూర్చి జరిగిన వాటిని మాత్రమే విడుదల చేశారు. అట్లా చేయవలసిందని పాకిస్తాన్ చేయగా చేశారు. తక్కిన విషయాలను గూర్చిన ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రకటించవద్దని, యీ ఒక్క కాశ్మీర్‌ను గూర్చినదాన్ని మాత్రమే ప్రకటించ వలసిందని పాక్ ప్రధాని భారత ప్రధానిని కోరారు.

ఈ ప్రకటితం అయిన ఉత్తర ప్రత్యుత్తరాలు 112 పేజీల గ్రంథంగా తయారైంది. ఇందులో మొత్తం 25 ఉత్తరాలు మొత్తం 40 వేల శబ్దాలు ఉన్నాయి.

ఇందులో నెహ్రూ సెప్టెంబరు 29 వ తేదీనాడు వ్రాసిన ఉత్తరం చివరిది. దీన్ని నెహ్రూ సెప్టెంబరు 21 వ తేదీనాడు మహమ్మదాలీ వ్రాసిన ఉత్తరానికిన్నీ, కాశ్మీర్ సమస్యను భద్రతా మండలి ముందు వుంచుతామని ఆయన చేసిన ప్రకటనకున్నూ, ప్రత్యుత్తరంగా వ్రాశారు. అయితే పాకిస్తాన్ ప్రభుత్వం ఈ ఉత్తరాన్ని విడుదల చేయవద్దని, సెప్టెంబరు 21 దాకా జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలనే అక్టోబరు 1 వ తేదీనాడు విడుదల చేయవలసిందని కోరింది. ఇండియా ప్రభుత్వం 5 వ తేదీనాడు విడుదల చేస్తానని సూచించింది. ఈసూచనకు పాక్ ప్రభుత్వం అంగీకరించిందిగాని, నెహ్రూ వ్రాసిన సెప్టెంబరు 29 ఉత్తరాన్ని విడుదల చేయడానికి అంగీకరించలేదు. అయినా భారత ప్రభుత్వం దాన్నిగూడా విడుదల చేసింది.

ఈ ఉత్తరాలలో కాశ్మీరు వ్యవహారాన్ని గూర్చిన అనేక విషయాలు ప్రసంగించబడినాయి. 1954 మార్చి 5 వ తేదీనాడు వ్రాసిన ఉత్తరంలో ప్రధాని పండిట నెహ్రూ అమెరికా మిలటరీ సహాయాన్ని పుచ్చుకోడానికి పాకిస్తాన్ అంగీకరించినందువల్ల కాశ్మీర్ సమస్యకు సంబంధించిన వాతావరణం అంతా ఎట్లు మారిపోయిందో వివరించారు. ఇండియా పాకిస్తాన్ సంబంధాలలో ఇది చాలా మార్పును తెచ్చిపెట్టిందన్నారు. ఈ సైనిక సహాయాన్ని పాకిస్తాన్‌కు అమెరికా ఇవ్వడానికి అంగీకరించినందువల్ల ఈ కాశ్మీర్ సంగతి సందర్భాలన్నీ మారిపోయినాయి. ఇంతకాలం మనం ఈ విషయాన్ని గూర్చి జరిపిన సమాలోచనలు ఇప్పుడు ఈ సహాయంవల్ల ఎందుకూ కొరగానివై పోయినాయి అన్నారు.

పాకిస్తాన్ ప్రధానమంత్రి సెప్టెంబరు 21 వ తేదీనాడు వ్రాసిన ఉత్తరం అటు, ఇటు జరిగిన వాదోపవాదాలన్నింటిని సూత్రీకరించేసి, ఇక ఈ పాఠశాత్మమాలోచనలవల్ల ఈ సమస్య తేలదని తేలిపోయింది. అందువల్ల దీనిని తిరిగి భద్రతాసంఘానికి పంపించడమే యుక్తం అని తమభావాన్ని వ్యక్తం చేశారు.

ఈ ఉత్తరానికి జవాబుఇస్తూ ప్రధాన మంత్రి నెహ్రూ తమ సెప్టెంబరు 29 ఉత్తరంలో ఇట్లు వ్రాశారు: 1947 అక్టోబరులో కాశ్మీర్‌లో ఏమి జరిగిందో మేము మరిచిపోలేదు. అప్పుడు పాకిస్తాన్ కాశ్మీర్‌మీద హఠాత్తుగా పాశవికమైన దండయాత్రను చేసింది. ఈ దండయాత్రకు బాధ్యత లెవరో ఇప్పుడు తేల్చవలసిన అవసరంగూడా లేదు. ఆ బాధ్యతను సమితే తేల్చింది. ఇంతకీ విషయమేమిటంటే అప్పుడు ఆ దండయాత్ర జరిగింది. ఇప్పుడు కూడా జరగవచ్చు. ఆ రోజుల్లో అధికారంలోవున్న పాకిస్తాన్ ప్రభుత్వం తాను కాశ్మీర్‌మీద దురాక్రమణ చేయలేదని బుకాయించింది. కాని, ప్రబలమైన సాక్ష్యంముందు నిల్వలేక ఒగ్గిపోయింది. సమితి కాశ్మీర్ కమిషన్‌వారు పాకిస్తాన్ ఈ దురాక్రమణ బాధ్యతను రూఢంచేశారు. అప్పుడు అందులో పాకిస్తాన్ బాధ్యత విస్పష్టమైనప్పటికీ, కాశ్మీర్‌మీద దండయాత్ర జరిగిందని, దురాక్రమణ జరిగిందని పూర్తిగా, సమగ్రంగా సిద్ధాంతం అయిపోయింది. ఇప్పుడు తిరిగి అటువంటిది జరిగితే, ఈ రెండు దేశాల మధ్య విషమపరిణామాలకు అది దారితీస్తుంది. అటువంటి కష్టం పాకిస్తాన్‌కు అమెరికా ఇస్తున్న సైనిక సహాయంవల్ల మరీ ఎక్కువౌతున్నది. ఈ విషయమై మేము ఔదాసీన్యం వహించలేము అని స్పష్టం చేశారు.

కాశ్మీర్ విషయం పాకిస్తాన్‌కు, ఇండియాకు వచ్చిన అభిప్రాయభేదం యుద్ధ విరమణ సరిహద్దు, ఎటు ఎంత సైన్యం వుండాలన్నది. దీన్ని గూర్చి చర్చలు జరిగాయి. భారత ప్రభుత్వం ఏమంటున్నదంటే: అమెరికా పాకిస్తాన్‌కు మిలటరీ సహాయాన్ని చేస్తున్నది. అందువల్ల ఈ సరిహద్దు ఇటువైపున ఇండియా సైన్యాలు పుష్కలంగా వుండాలి. ఎటువంటి అవాంతరమున్నా ఏర్పడితే, కాశ్మీర్‌ను రక్షించడానికి సమర్థమైనదిగా వుండాలి; అంటున్నది.

పాకిస్తాన్ ప్రధానికి తాను వ్రాసిన ఇన్ని ఉత్తరాల్లోను ఒక ఉత్తరంలో ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ చౌ. నెహ్రూ శాంతి సూత్రాలను గూర్చి ప్రసక్తిని గూడా తెచ్చారు. ఈ సూత్రాలను మహమ్మదాలీ దృష్టికి తెచ్చి, ఇటువంటి ప్రకటనవల్ల శాంతికి, భద్రతకు, స్నేహానుబంధాలకు ఎక్కువ హామీ లభిస్తుంది. మిలటరీ సంఘాలకన్నా, సైనిక సన్నాహాలకన్నా ఎక్కువ బలం చేకూరుతుంది. ఇటువంటి ప్రత్యాసన్నాన్ని అంగీ

(3 వ పేజీచూడుడు)

## ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థ

### ఇండియా కూడా చేరకపోదని సయాం మంత్రి ఊహ

న్యూయార్కు, అక్టోబరు 4: "సైనికబలం, దురాక్రమణ నివారణ ఒప్పందాలూ, కమ్యూనిజాన్ని ఎదుర్కోడానికి చాలవన్న విషయం ఇండియాకు ఎప్పటికైనా అవగతమౌతుంది. చివరికి, ఆగ్నేయ ఆసియా రక్షణవ్యవస్థలో ఇండియా చేరిపోతుంది" అని థాయిలెండ్ విదేశాంగమంత్రి వాక్ వైథాయకన్ ఇక్కడ ఒక సభలో తన ఊహలు వెల్లడిచేశారు. వెనకబడిన ఆసియా దేశాలన్నీ ముందుకు రావాలంటే పారిశ్రామిక అభివృద్ధి సాంకేతిక సహాయమైనా సంపాదించుకోవాలి. లేకపోతే ఏదేశ అవదారి చూసుకోవాలి. పోతే, దురాక్రమణలను ఎదుర్కొనడానికీ, విద్రోహశక్తులని అణచివేయడానికీ సైనికబలం కావాలి. అందువల్ల, విదేశాలనుండి ఆర్థిక సహాయం పుచ్చుకున్నప్పుడు, కొంత సైనికసహాయం కూడా తీసుకోవాలి అని వైథాయకన్ చెప్పారు.

## పారిశ్రామిక వివాదాల చట్ట సవరణ

### సమగ్రమైనబిల్లు ప్రతిపాదన సంకల్పాన్ని విరమించినట్లు కేంద్రమంత్రి ప్రకటన

అహమ్మదాబాదు, అక్టోబరు 4: సమగ్రమైన ఒక బిల్లును ప్రతిపాదించడానికి బదులు ఇప్పుడున్న పారిశ్రామిక తగాదాల చట్టములో అవసరమైన మార్పులుచేయ భారత ప్రభుత్వం ఉద్దేశిస్తున్నదని కేంద్రప్రభుత్వ కార్మికశాఖ మంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయి ఈ వేళ యిక్కడ ప్రకటించారు.

"పారిశ్రామిక తగాదాల చట్టాన్ని సవరించడానికి భారత ప్రభుత్వ కార్మికశాఖ ఆలోచిస్తున్నది. ఈ సవరణ అనుసరించి రాజీ సంఘాలు ఏర్పడతవి ఈ రాజీసంఘాలలో కార్మికుల ప్రతినిధులు పెట్టబడేదారు. ప్రతినిధులు వుంటారు. ఇందువల్ల అపీళ్లకు అవకాశంలేకుండా పోతుంది. పారిశ్రామిక తగాదాల పరిష్కారంలో ఆలస్యము, అనవసర తతంగాలు లేకుండా వుండడానికిగాను సులువైన కార్య పద్ధతులను కనిపెట్టాలి" అని దేశాయి ప్రతినిధుల సభలో వివరించారు.

పరిశ్రమలను క్రమబద్ధం చేయడం విచ్ఛిన్నకమైనదిగా వుండాలని, బలవంతంగా పనికిరాదనీ దేశాయి చెప్పుతూ ఈ విషయంలో ప్రభుత్వం మార్గం మాత్రమే దర్శించగలదుగాని కార్మికులనుగాని, యజమానులనుగాని బలవంతం చేయజాలదని అన్నారు. నిరుద్యోగులకు మనం ఉద్యోగాలు చూపించజాలనంతవరకు, పరిశ్రమలను క్రమబద్ధం చేయడమూ లేదా నవీనం చేయడమూ అనే దానిపేర కార్మికులను పనుల నుండి తొలగించవీలులేదు. పరిశ్రమలను క్రమబద్ధంచేయడమనేది ఒక్క కార్మికులకు మాత్రమే వర్తించదగూడదు. పరిశ్రమ నిర్వాహకసంబంధమైన, కార్యకలాపాలకు, అమ్మకాలకు కొనుగోళ్లకు గూడా అది వర్తించాలి అని దేశాయి అన్నారు.

## పశ్చిమ జర్మనీలో మిత్ర రాజ్య ఆక్రమణకు స్వస్తి

### కమిషనర్ కార్యాలయాలను ఎత్తివేయడానికి మూడు అగ్రరాజ్యాల నిర్ణయం

లండన్, అక్టోబరు 3: పశ్చిమ జర్మనీలో ఆక్రమణ ప్రభుత్వాన్ని అంతం చేసి, అందుకు సంబంధించిన ఆక్రమణ శాసనాన్ని రద్దుచేసి, అక్కడ ఉన్న మూడు మిత్రరాజ్య హైకమిషన్ కార్యాలయాలను ఎత్తివేయడానికి అగ్రరాజ్యత్రయం నిశ్చయించింది. బ్రసెల్సు సంధిలో చేరడానికి పశ్చిమజర్మనీ ఇటలీలను ఆహ్వానించాలని కూడా ఈ సందర్భంలో నిశ్చయించబడింది.

నేటి రాత్రి విడుదల అయిన 9 రాజ్యాల సమావేశపు "తుది నిర్ణయ ప్రకటన" ఈ నిర్ణయాలను వెల్లడి చేసింది. యూరప్ ఐక్యతే బ్రసెల్సు సంధికి ప్రధాన లక్ష్యంచేసి విస్తృతంగా దానిలో తగు మార్పులు చేయబడగలవని కూడా ఈ ప్రకటన తెలియ చేసింది.

పశ్చిమ జర్మనీలో ఆక్రమణపు ప్రభుత్వాన్ని రద్దుచేసి, అక్కడి మూడు హైకమిషన్ కార్యాలయాలను ఎత్తివేయడానికి తగు విధానాలు నిర్ణయించేనిమిత్తం నాలుగురాజ్యాల ప్రతినిధులూ అతిత్వరలో సమావేశమవుతారు.

ఇటుపై ఈమూడు హైకమిషన్ కార్యాలయాలూ, జర్మనీ సమాఖ్య ప్రభుత్వం అంగీకారం లేకుండా తమ ఆక్రమణ హక్కులను వినియోగించవు. ఐతే నిరాయుధీకరణ, నిస్సైనికీకరణ వ్యవహారాలలో మాత్రం జోక్యం చేసుకోడానికి వీటికి హక్కు ఉంటుంది.

బ్రసెల్సు ఒప్పందంలోకి పశ్చిమ జర్మనీ, ఇటలీలను ఆహ్వానించ నిశ్చయించబడింది. ఈ సంధిలోని "పరస్పరసహాయ" సూత్రం ఇటుపై యీ రెండు దేశాలకుకూడా వర్తిస్తుంది.

బ్రసెల్సు సంధి దేశాలు ఉత్తర అట్లాంటిక్ మండలికి ఇవ్వవలసిన సేనల గరిష్ఠ ప్రమాణాలు నిర్ణయించడం, సభ్యదేశాల అంతరంగిక రక్షణబలాలు, పోలీసుబలాల సంఖ్యకుకూడా పరిమితులు నిర్ణయించడం జరుగుతుంది.

ఆయుధాల కంట్రోలు సంఘంవారు అణ్వస్త్రాలూ, క్రిమి, రసాయనిక ఆయుధాలూ మొదలైనవాటిపైనిషేధాన్ని పటిష్ఠంగా అమలు జరపడం, ప్రతిదేశంలోను ఇప్పుడు నిల్వలో ఉన్న ఆయుధాల ప్రమాణాలపై అజ్మాయిషి చేయ్యడం నిర్వహిస్తారు.

## ఆసియా ప్రజల జీవన ప్రమాణం హెచ్చింపు

### పశ్చిమ రాజ్యాలు సహాయపడగలవని కెనడా ప్రధాని హామీ

ఆటావా, అక్టోబరు 4: ఆసియా ప్రజల జీవన ప్రమాణాలు అభివృద్ధి చేయడానికి ఆయాదేశాలు సాగిస్తున్న కృషి ఫలప్రదం కావడానికి పశ్చిమరాజ్యాలు సహాయం చేయగలవని కెనడా ప్రధాని నేడు పార్లమెంటు భవనంలో ఇక్కడ కొలంబోపథక దేశాల పంచదివ సమావేశాన్ని ప్రారంభిస్తూ హామీఇచ్చారు.

ఈసందర్భంలో ఇండోచైనా ప్రజలకు విశేషిస్తూఇచ్చిన ఒక సందేశంలో లావోస్, కంబోడియా, వియత్నాంలలో, ఆ ప్రజల అభిమతాలకు అనుగుణము వారికి సౌఖ్యమయ జీవనం ప్రసాదించగలవని అను ప్రభుత్వాలు అవతరించగలవని కెనడా ప్రధాని ఆశాభావం వ్యక్తపరచారు.

ప్రపంచంలో ముడిసరుకులకు ధరలు నిర్ణయించి సుస్థిరం చేయడంద్వారా వెనుకబడ్డ దేశాలకు సహాయం చేయాలని ఇండోనీషియా విదేశాంగ మంత్రి డా॥ సునర్జో విజ్ఞప్తిచేశారు.

పాకిస్తాన్ ఆర్థికమంత్రి ప్రసంగిస్తూ విశేషార్థ స్ఫూర్తియుతమైన యీ కొలంబో పథకం పటిష్ఠమై పురోగమిస్తే, ఇది చరిత్రగతినే మార్చగలదన్నారు. ఆసియా ప్రజలీనాడు, అసలే తక్కువగానున్న జీవన ప్రమాణాలను ఇంకా పరిమితం చేసుకుని, ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలకై కృషి చేస్తున్నారనీ, వారి కృషిఫలితంగా ముందుతరాల వారు సుఖపడగలరనీ ఆయన అన్నారు.

కొలంబో పథకంలో జపానుకు సభ్యత్వం ఇచ్చేవిషయమై ఇంతకు ముందు జరిగిన లోపాయికారీ చర్చలలో ఇండోనీషియా ప్రతినిధి ఒక్కరే వ్యతిరేకత తెలిపారనీ, తన కర్తవ్యం తెలుపవలసిందని ఇండోనీషియా ప్రభుత్వాన్ని ఆయన తంతిద్వారా కోరారనీ, అధికార వర్గాలవారు ఇవాళ చెప్పారు.

## ఫార్మోజాపై చైనా దాడిచేస్తే అణ్వస్త్ర ప్రయోగం జరుగుతుందట

తైపే, అక్టోబరు 4: కమ్యూనిస్టుల పారామౌట్ ఫార్మోజాపై దాడిచేయ తలపెట్టారంటే, ఫార్మోజాలో కొండజాతులవారంతా అణ్వస్త్రాల వర్షం కురిపించి ఎదుర్కోగలరనీ, ఈ విద్యావాళ్ళకి తరిపీదు ఇవ్వబడిందనీ జాతీయ చైనా ప్రభుత్వప్రతినిధి ఒకరు నేడు అన్నారు.

## చైనా భారతదేశాల వాణిజ్య ఒప్పందం

### ఢిల్లీ చర్చల సమాప్తి: ఈ వారమే సంతకాలు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, అక్టోబరు 4: ఇండియా, చైనాల మధ్య ఇక్కడ జరుగుతున్న వాణిజ్య సంప్రదింపులు జయప్రదంగా ముగిసినవి. ఒప్పందంపై ఈ వారంలోనే సంతకాలు జరుగుతవి.

పెకింగ్ ప్రభుత్వపు ఉత్తర్వుల కోసం చైనా ప్రతినిధులు నిరీక్షిస్తున్నందువల్లనే ఇంతవరకూ ఆలస్యం అయింది. జరిగబోయే ఒప్పందం మామూలుగా అన్ని దేశాల మధ్యనూ జరిగే వాణిజ్య ఒప్పందంవలెనే ఉంటుంది. అంటే ఇండియా రూపాయిలలో లావాదేవీలు సులభంగా జరగటానికి వీలుగా చైనాప్రభుత్వం భారత బ్యాంకులలో ఖాతాలు ఏర్పాటు చేసుకుంటుంది.

తూర్పు జర్మనీతో కూడా ఇక్కడ వాణిజ్య సంప్రదింపులు జరుగుతున్నవి. అయితే తూర్పు జర్మనీ ప్రభుత్వాన్ని భారతదేశం గుర్తించలేదు కనుక, ఆ ప్రభుత్వంతో ఒప్పందం చేసుకోవటం ఎట్లా అన్నది ఒక సమస్యగానే ఉన్నది. ఐతే అక్కడనుంచి ఒక వాణిజ్య ప్రతినిధివర్గాన్ని రానిచ్చి, సంప్రదింపులు జరపటాన్ని బట్టి చూస్తే జర్మనీతో వాణిజ్య సంబంధాలు పెంచుకోవాలనే కోరిక ఉన్నట్లు స్పష్టపడుతున్నది. అందువల్ల తూర్పు జర్మనీ ప్రభుత్వాన్ని ఇండియా గుర్తించటమన్నది దీనికి ఒక మార్గం కావచ్చును.

## కౌలుదార్ల రక్షణ చట్టం

### రెండేళ్లపాటు పొడిగిస్తూ ఆర్డినెన్సు

కర్నూలు, అక్టోబరు 5: మద్రాసు కౌలుదార్లు రైతుల రక్షణ చట్టం (1949) జీవితాన్ని 1954 అక్టోబరు 7 వ తేదీనుంచి 1956 అక్టోబరు 7 వ తేదీదాకా మరి రెండేండ్లు పొడిగిస్తూ ఆంధ్ర గవర్నరు మొన్న 2 వ తేదీనాడు ఒక ఆర్డినెన్సు జారీచేశారు. (స్వ. వి.)

## హైద్రాబాదు గ్రామసీమల్లో సహకారోద్యమవ్యాప్తికి కృషి

హైదరాబాదు, అక్టోబరు 4: అఖిలభారత సహకార ప్లానింగు కమిటీవారు నిర్ణయించిన లక్ష్యసంఖ్యను శాస్త్రీయంగా, ప్రతిమ పంచవర్ష ప్రణాళిక కాలంలో మిగిలిన రెండు సంవత్సరాలలోనూ 5497 సహకార పరపతి సంఘాలను స్థాపనచేసి 7,76,079 సభ్యులను చేర్పించడానికి హైదరాబాదు ప్రభుత్వపు గ్రామ పునర్నిర్మాణ శాఖవారు ఉద్దేశించినట్లు అధికారవర్గాలద్వారా తెలియవచ్చింది.

ప్రస్తుతం హైదరాబాదు గ్రామసీమల్లో 8,10,300 మందితో 4458 సహకార పరపతి సంఘాలు మాత్రమే ఉన్నాయి. (యు. పి. ఐ.)

## సిమెంటుధర హెచ్చింపు

కర్నూలు, అక్టోబరు 5: ప్యాక్టరీలకు ఉపయోగించిన కొత్తగోతాల ఖర్చుక్రింద ఒక్కొక్క టన్ను సిమెంటుమీదా 13 రూ॥లు అదనంగా వసూలు చేయడానికి ఆంధ్ర ప్రభుత్వంవారు సిమెంటు విక్రేతలకు అనుమతి యిచ్చారు.

## ప్రకటన

అక్టోబరు నెల 6-వ తేదీ మహార్నవమి యగుటచే మా కార్యాలయమునకు సెలవు. అందువల్ల 7-వ తేదీ గురువారం పత్రిక వెలువడదు.

మేనేజరు.

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆశ్వయుజ శు॥ నవమి 1954 సం॥ అక్టోబరు 6 బుధవారం బు॥ నవమి 24-0 ఉ షా రా 4-11 వర్జ్యం 1-32 ల 13-12 కు. మహార్నవమి.

శు॥ దశమి అక్టోబరు 7 గురువారం శు॥ దశమి 28-39 శ్రవ రా 4-17 వర్జ్యం 8-12 ల 9-48 కు. విజయదశమి.

ఆంధ్రపత్రిక

ఒడు వేయని యొ వరించిన వరవళి యుక్తియు తన మహంబున వగు దా వారలకు వనిపేయువునికి వలాయుబు వరమధర్మ వధము లెల్లవా-(మహాభారతము

శ్రీ జయ సం॥ ఆశ్వయుజ శు॥ నవమి

బుధవారం

## ఉత్తర ప్రత్యుత్తరాలు

పాకిస్తాన్‌లో ఎవరు ప్రధాన మంత్రిగావున్నా భారత-పాకిస్తాన్ సంబంధాలలో మార్పు వుండదని ధృవపడినది ఈ రెండు దేశాల స్నేహము, సఖ్యతలకు ప్రతిబంధకముగా వుంటున్న కాశ్మీరు, కాందిశీకుల ఆస్తి, కాల్వలనీరు సమస్యలు పరిష్కారము కావని బుజువైనది. "ప్రభుత్వముల మార్పు వల్ల ప్రయోజనము లేదు. ప్రజా ప్రతినిధుల హృదయాలలో పరివర్తన రావాలి. అప్పుడే ఈ సమస్యలు పరిష్కారం కాగలవు." అని లియాఖత్ అలీఖాన్ పాకిస్తాన్ ప్రధానమంత్రిగావున్న నాటినుంచి ఇప్పటి వరకు ప్రధానమంత్రి నెహ్రూ విసుగువిరామము లేకుండా పాకిస్తాన్ ప్రధానమంత్రులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు స్పష్టంచేసినవి. కనుక నే ప్రధాన మంత్రి నెహ్రూ క్రిందటినెల 29 వ తేదీన పాకిస్తాన్ ప్రధాన మంత్రి మహమ్మద్ అలీకి వ్రాసిన లేఖలో "ఈ విధంగా ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించడం నిష్ప్రయోజనం అన్నమాటలనే అంటూ, చెప్పిన విషయాలనే చెప్తూ పోయినందువల్ల లాభంలేదు." అని హెచ్చరించవలసివచ్చింది.

పాకిస్తాన్ ప్రధాన మంత్రులు భారత ప్రధాన మంత్రితో ఉత్తరప్రత్యుత్తరాలను కొనసాగించడం వివిధ సమస్యల పరిష్కారావకాశాలను వృద్ధి చేయడానికి కాదని, విభేదాలను తొలగించడానికి కాదని మహమ్మద్ అలీ లేఖలు అనందిగ్ధంగా ప్రకటించినవి భారతదేశంపై ఆరోపణలు చేసి, ఆ ఆరోపణలను ప్రచారం చేయడానికి పాకిస్తాన్ ప్రధాన మంత్రులీ పద్ధతిని అనుసరిస్తున్నట్లు స్పష్టమైనది. ఆరు సంవత్సరాలక్రితం పంజాబు కాల్వల నీటిపంపకంపై పాకిస్తాన్ ప్రభుత్వం ఒడంబడిక చేసుకున్నదనీ, భారత ప్రభుత్వం అప్పట్నుంచీ అనుసరిస్తున్న విధానం ఆ ఒడంబడికకు అనుగుణంగానే వున్నదనీ పాకిస్తాన్ ప్రధానమంత్రి మహమ్మద్ అలీ అయినా అంగీకరించక తప్పదు. ఆ ఒడంబడికను త్రోసిరాజనగల సాహసం వారికి లేదు కనుకనే ప్రప్రథమంగా వారిప్పుడు, భారత ప్రభుత్వ పెద్దలు ఖాతా, యింపులకు లొంగిపోయి ఆనాడు ఆ ఒడంబడికను అంగీకరించినట్లు ప్రకటిస్తున్నారు. "ఈ విషయాన్ని తెలుసుకోవడానికి రెండేండ్లు పట్టిందా?" అని ప్రధానమంత్రి నెహ్రూ అడిగిన ప్రశ్నకు పాకిస్తాన్ ప్రధాన మంత్రి ఏ సమాధానమిస్తారో చూడవలసివున్నది.

కాశ్మీరు, కాల్వలనీరు, కాందిశీక ఆస్తి సమస్యల పరిష్కారానికిగల అవకాశాల అన్వేషణ పేరిట పాకిస్తాన్ ప్రధానమంత్రి మహమ్మద్ అలీ ఒక సంవత్సరంగా భారత ప్రధానమంత్రి నెహ్రూతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ వున్నారు. వీటిలో ఒక్క కాశ్మీరు సమస్యకు సంబంధించిన లేఖలుమాత్రం ఈ నెల 4 వ తేదీన భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలు వెల్లడి చేసినవి. కాల్వలనీరు తగాదా ఇంకా ప్రపంచ బ్యాంకు ప్రతినిధుల విచారణలో వుంది. కాందిశీక ఆస్తి విషయంలో ఇంకా భారతప్రభుత్వంతో సంప్రతింపులు సాగించడానికి పాకిస్తాన్ ప్రభుత్వం నిశ్చయించుకున్నది. కాశ్మీరు సమస్యను తిరిగి భద్రతామండలికి నివేదించ నిర్ణయించుకున్న కారణంగా ఆ సమావేశం జరిగే లోపుగా కాశ్మీరు సమస్యకు సంబంధించిన లేఖలను ప్రచురించాలని పాకిస్తాన్ ప్రధాన మంత్రి కోరారు. భారతప్రభుత్వానికి దురుద్దేశాలేమీ లేనందువల్ల పాకిస్తాన్ ప్రధాన మంత్రి కోరికను వెంటనే మన్నించింది.

కాశ్మీరు వ్యవహారంపై సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలు కొత్తవిషయాలను వెల్లడించలేదు. అడ్మిరల్ నిమిట్జ్‌స్థానే మరొకర్ని జనవాక్య నిర్ధారణాధికారిగా నియమించే విషయంలో నెహ్రూ-మహమ్మద్ అలీగార్లకు అంగీకారం కుదిరిందని క్రిందటి ఏప్రెల్‌లోనే వెల్లడి అయింది. ఆ విషయం ఇప్పుడు ధృవపడింది. పాకిస్తాన్ ప్రధానమంత్రి తిరిగి తన అభిప్రాయాన్ని మార్చుకోలేదని వెల్లడి అయినది. అంతకుమించి ఈ ఏడాది ఉత్తర ప్రత్యుత్తరాలు ఏమీ తెలియచేయడం లేదు.

కాశ్మీరులో యుద్ధ విరమణ హద్దుకు అటుఇటు వుండవలసిన పాకిస్తాని, భారత సైనికదళాల సంఖ్యపై సమాధానం కుదరక పోయినప్పటికీ జనవాక్య నిర్ధారణాధికారి నియామకం జరగాలనే పాకిస్తాన్ ప్రధానమంత్రి ప్రతిపాదనను పండిట్ నెహ్రూ తిరస్కరించారు. జనవాక్య నిర్ధారణ శాంతంగా, నిష్పాక్షికంగా జరగడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడనప్పుడు అడ్మిరల్ నిమిట్జ్ బదులు మరొకర్ని నియమించి ప్రయోజనం ఏముంటుంది? అట్టి నియామకం అవసరం ఏముంటుంది? జనవాక్య నిర్ధారణకు అనుకూలమైన పరిస్థితులను కల్పించడం ముఖ్యంగాని, నిమిట్జ్ స్థానే మరొకర్ని నియమించడం అంత ముఖ్యంగాదు.

ఈ విషయాన్ని అంగీకరించడానికి పాకిస్తాన్ ప్రధానమంత్రి ఇప్పటికీ సిద్ధంగాలేరు. కాశ్మీరులో జనవాక్య నిర్ధారణకు, జనవాక్య నిర్ధారణాధికారి నియామకానికి ఆటంకముగా వున్నది కాశ్మీరు భూభాగంపై ఎవరిబలగం ఎంతవుండాలన్న విషయంపై భారత-పాకిస్తాన్ ప్రభుత్వాలకు సమాధానం కుదరకపోవడమే. పాకిస్తాన్ అమెరికానుంచి సైనికసహాయాన్ని పొందడంవల్ల ఈ విషయం మీద సమాధానం కుదరడం దుస్సాధ్యమైనది. పాకిస్తాన్, అమెరికానుంచి సైనిక సహాయాన్ని పొందినందువల్ల కాశ్మీరు సమస్య స్వభావం ఎలా మారింది అన్న మహమ్మద్ అలీ ప్రశ్నకు పండిట్ నెహ్రూ 29వ తేదీ లేఖ స్పష్టంగా సమాధానమిస్తున్నది.

1947 వ సంవత్సరం లో పాకిస్తాన్ హఠాత్తుగా కాశ్మీరుపై దురాక్రమణ జరిపింది. దాదాపు పది మాసాలు యుద్ధం సాగించింది. ఇంత చేసి కూడా కాశ్మీరుపై జరిగిన దండయాత్రతో తమకు సంబంధం లేదని పాకిస్తాన్ అధికారులు వాదించారు. వారి వాదన సహేతుకం కాదని, పాకిస్తాన్ కాశ్మీరుపై దురాక్రమణ చేసిందనడం నిర్వివాదమని సమితి కమిషన్ తీర్పు యిచ్చింది. కాశ్మీరునుంచి భారతసైన్య ఉపసంహారణ జరిగిన అనంతరం, జనవాక్య నిర్ధారణ ప్రారంభమైనతర్వాత ఈ చరిత్ర పునరావృత్తం కాదని ఎవరు పూచీ పడతారని ప్రధాన మంత్రి నెహ్రూ ప్రశ్నిస్తున్నారు. ఈ ప్రశ్నకు పాకిస్తాన్ ప్రధానమంత్రి సమాధానమివ్వలేదు. కాగా పండిట్ నెహ్రూ పదేపదే చేస్తున్న నిర్యుద్ధ ప్రకటన ప్రతిపాదనను తిరిగి మహమ్మద్ అలీ తిరస్కరించారు. అందువల్ల కాశ్మీర్‌కు పాకిస్తాన్ యుద్ధప్రమాదం తప్పలేదనే భావించవలసివుంటుంది.

అమెరికానుంచి పొందే సైనికసహాయాన్ని పాకిస్తాన్ వదులుకోదు. ప్రధానమంత్రి నెహ్రూ సూచించిన నిర్యుద్ధ ప్రకటనను చేయడానికి మహమ్మద్ అలీ అంగీకరించరు. ఈ పరిస్థితులలో కాశ్మీరు సమస్య సంప్రతింపులద్వారా పరిష్కారం అయ్యే అవకాశంలేదు. పాకిస్తాన్ ప్రధానమంత్రికి కూడా ఈ విషయం తెలుసును. కనుకనే ఈ సమస్యను తిరిగి భద్రతామండలి చర్చించాలని పాకిస్తాన్ కోరుచున్నది. ఆ చర్చలలో ఇతర దేశాలు తమకు అనుకూలంగా వుండేటట్లు చేసుకోవడానికి పాకిస్తాన్ ప్రధాన మంత్రి అమెరికా వెళ్లారు కూడా. ఇవి ఏవీ కాశ్మీరు సమస్యను పరిష్కరింపలేవని పాకిస్తాన్ ప్రధానమంత్రి తన అమెరికాయాత్రవల్ల గ్రహించకల్గిన కాశ్మీరు సమస్యాపరిష్కారం ఇక ముందైనా సులభంకావచ్చును.

## పాక్ - అమెరికా సైనిక ఒప్పందం

### పెద్ద తప్పిదమని నీగ్రో రచయిత విమర్శ

అలహాబాదు, అక్టోబరు 4: పాకిస్తాన్‌తో సైనిక సంధి చేసుకోవడం అమెరికా చేసిన గొప్ప తప్పిదమని ప్రఖ్యాత నీగ్రో పత్రికా రచయిత రోవాన్ కోవాన్ నేడు హిమాదల క్లబ్‌లో ప్రసంగిస్తూ తమ వ్యక్తిగతాభిప్రాయం పునరుద్ఘాటించారు. (హైదరాబాదులో యిదివరకొకసారి యిదే అభిప్రాయాన్ని ప్రకటించారు.) అయితే, కమ్యూనిస్టు దురాక్రమణ నిరోధానికి సమష్టిరక్షణ కార్యక్రమం క్రిందనే అమెరికా యీ చర్యతీసుకున్నదనీ, ఇందువల్ల భారతదేశం కలతచెందవలసిన అవసరం లేదనీ రోవాన్ అన్నాడు.

పాకిస్తాన్, భారతదేశాలు, నిరంతర ఘర్షణపడుతూ వుండడం అమెరికాకు ఎన్నడూ క్షేమకరం కాదని ఆయన వివరించారు. అమెరికా ఆయుధాలను పాకిస్తాన్ భారతదేశంపై వుపయోగిస్తుందని భయపడటానికి ఆధారాలు లేవన్నాడు.

## పత్రికా స్వాతంత్ర్యం

లీడర్ పత్రికాసంపాదకు లిచ్చిన స్వాగతానికి సమాధానమిస్తూ పత్రికా స్వాతంత్ర్యాన్ని అతిపవిత్రంగా స్వదేశ్యాలు జాతీయ హారాలు ఎంచుతారని పత్రికారచయితలు, వాటిల్లో పనిచేసేవారు స్థానిక సమస్యలను, దేశ సమస్యలను, అర్థంచేసుకుని ఒక బాధ్యతాయుతమైన ... [illegible]

# అదీ.... ఇదీ.... అన్నీ....

ఆంధ్ర మహాసభలో అక్టోబరు మహోత్సవాల మాసంగా కన్పిస్తుంది. అక్టోబరు 1 ఆంధ్రరాష్ట్రావతరణ దినం అక్టోబరు 2 గాంధిమహాత్ముని జయంతి నెలాఖరున సర్దార్ పటేల్ పుట్టినరోజు పండుగవస్తుంది.

ఈజాతీయ పర్వదినాలు ఇలావుంటగా హిందువులందరికీ, వారు ఏప్రాంతంలోవున్నా ఏకులానికి చెందినా పెద్ద పండుగలైన దసరాదీపావళి ఈ మాసంలో వచ్చినవి ఈసంవత్సరం.

1954 అక్టోబరుమాసం మామూలు అక్టోబరులకంటే, ఎన్నో విధాల, అన్ని విధాలవిశిష్టమైన మాసంగా తోస్తున్నది.

దేశమంతటా, ఈ నెల అంతా రేడియో ఉత్సవాలు జరుగుతున్నవి. అక్టోబరు 1 న భారత తిపాలాదిశ్శ్వల శతవార్షికోత్సవం ప్రారంభమైంది. రెండవ తేదీన రేడియో నెల ఉత్సవాలు ప్రారంభమైనవి.

ఈరెండూ కూడా నవభారత విజ్ఞానవికాసాలకు చిహ్నాలే. ప్రాతిలను దేశంలోని వివిధప్రాంతాలకు అందచేసే తపాలాబిళ్ళలు, ధ్వనిని దేశం నలుమూలల వినిపింపచేసే రేడియోలు భారతీయులలో ఐకమత్యాన్ని సాధింపగలవే, ఐకమత్యాన్ని పెంపొందింపగలవే.

* * *

దేశంలో ఈనాడు 22 రేడియో ప్రచారకేంద్రాలున్నవి. ప్రధానమైన ప్రతిప్రాంతీయ భాషకు ఒక బ్రాడ్‌కాస్టింగ్ సేవను ఏర్పడింది. కొన్ని భాషలకు రెండు మూడు స్టేషన్లలో ప్రాధాన్యంకూడా వుంది.

భారత రాజ్యాంగం పరిగణించిన ప్రాంతీయభాషలు పధ్నాలుగు మాత్రమే. ఒక్కొక్క ప్రాంతీయభాషకు ఒక్కొక్క రేడియో ప్రసారకేంద్రాన్ని ఏర్పరచినా పధ్నాలుగు కేంద్రాలే చాలును! అయితే ఈసూత్రం ప్రకారం బ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్ల పునర్నిర్మాణం సాధ్యంగాదు.

రేడియో స్టేషన్ల స్థాపనలో ప్రాంతీయభాషల సంఖ్యతోపాటు, యీ భాషాప్రాంతాల విస్తీర్ణాన్ని కూడా విచారణలోకి తీసుకోవలసి వుంటుంది. భారతరాష్ట్రాలు భాషనుబట్టి పునర్నిర్మాణం కాలేదన్న విషయాన్ని గుర్తుంచుకోవలసి వుంటుంది. భాషనుబట్టి భారత రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగినా చాలా రాష్ట్రాల్లో రెండుమూడు భాషలవారు వుండిపోగలరనే విషయాన్నికూడా విస్మరింపరాదు.

వీటన్నింటినీ మనస్సులో వుంచుకునే కేంద్రప్రభుత్వ బ్రాడ్‌కాస్టింగు శాఖవారు రేడియో విస్తరణ కార్యక్రమాన్ని నిర్ణయిస్తున్నారు. ఏర్పడివున్న కేంద్రాల ప్రసారశక్తిని వృద్ధిచేస్తూ, కేంద్రాలులేని ప్రాంతాల్లో కేంద్రాలను ఏర్పాటు చెయవలసి వుంటుంది.

సత్వరంగా అభివృద్ధి కావలసిన ప్రసార కేంద్రాలలో విజయవాడ కేంద్రం ఒకటి. ప్రస్తుతం విజయవాడలోవున్న ట్రాన్స్‌మిటర్ ఒక్క కిలోవాట్ శక్తికలిగినది మాత్రమే. ఇక్కడ 20 కిలోవాట్ల ట్రాన్స్‌మిటర్‌ను ఏర్పాటు చేయడానికి నిర్ణయమైంది. రేడియో ఉత్సవాలను ప్రారంభిస్తూ ఈట్రాన్స్‌మిటర్ స్థాపన త్వరలోనే జరగ్గలదని డాక్టరు కేస్కర్ వెల్లడించారు. రేడియో కేంద్రం ప్రసారశక్తి వృద్ధికావడంతోపాటు రేడియో స్టేషనుకూడా అభివృద్ధి కావాలి.

విజయవాడ రేడియో కేంద్రానికి ఇంతవరకూ స్టేషన్ డైరెక్టరు నియమింపబడినట్లు కన్పించదు. హైదరాబాదు, విజయవాడ, మద్రాసుస్టేషన్లకు వుమ్మడిగా ఒక భాషా సలహాదారుని నియమించడం జరిగింది. రేడియోవారు భాషవిషయంలో శ్రద్ధవహించడం హర్షింపతగిందే. కాని అంతకంటే శ్రద్ధవహింపవలసిన విషయాలు అనేకంగా వున్నవని వారు గుర్తింపక పోవడం శోచనీయం.

* * *

ఆంధ్రలో రేడియోలున్నవారు 31965 మంది. చెన్న రాష్ట్రంలో 83084 మంది రేడియోలున్నవారున్నారు. విజయవాడ రేడియో కేంద్రం అభివృద్ధికి డబ్బు ఖర్చు పెట్టాలంటే ఆంధ్రలో రేడియోలున్న వారు తక్కువనీ, విజయవాడ కేంద్రం గిట్టుబాటు కాదని అంటూ వచ్చారు మొన్నటివరకూ ఇప్పుడా దృక్పథంలోమార్పువచ్చింది. ఈ మార్పు అభ్యుదయ సూచకమే.

* * *

ఆంధ్రరాష్ట్రంలో రేడియోసెట్లున్నవారి సంఖ్య మద్రాసు రాష్ట్రంతో పోల్చిచూస్తే చాలా తక్కువేకావచ్చు. కాని ఆంధ్రలో రేడియో వినేవారి సంఖ్యమాత్రం తక్కువకాదు. మంచి ప్రోగ్రాములున్నప్పుడు పక్కింటికి వెళ్లి రేడియో వినేవారెందరో వున్నారు.

అలాగే పార్కులకు, హోటల్లకువెళ్లి వింటున్న వారి సంఖ్యను కచ్చితంగా చెప్పడం కష్టం. డాక్టర్ కేస్కర్ చెప్పినట్లు రేడియో సెట్లు చవకగా లభించితేగాని రేడియో స్వంతదారులసంఖ్య పెరగదు. ఆకాశ పేపరు కొనక, కొనలేక, కొన్నవారింటికివెళ్లి, లైబ్రరీలకువెళ్లి చదువుకునేవారే ఇంకా అత్యధిక సంఖ్యాకులుగా వుంటున్న ఆంధ్రదేశంలో రేడియోను కొనగలవారి సంఖ్య ఎలా పెరుగుతుంది?

ఆంధ్రలో రేడియోలసంఖ్య పెరగ ... [illegible] వ్యక్తి లేకపోవడం. ఇప్పుడిప్పుడే ఆంధ్రప్రభుత్వం విద్యుచ్ఛక్తిని గ్రామాలకు విస్తరింపజేస్తున్నది. మరొక పది సంవత్సరాల్లో రేడియో స్వంతదారుల సంఖ్య కనీసం యాభైవేలవరకైనా వృద్ధికావచ్చు. ఇప్పటికే మైసూరులో కంటె ఆంధ్రలో రేడియో స్వంతదారులు ఎక్కువగానే ఉన్నారు.

* * *

మొన్న శనివారంనాడు దేశమంతటా ప్రారంభమైన రేడియో ఉత్సవాలు పూర్తిఅయ్యేవరకి ఈకార్యక్రమాలను అన్నింటిని, కనీసం కొన్నింటినైనా, విన్నవారు అందరూ "అయ్యో మనఇంట్లో రేడియో లేకపోయిందే!" అని విచారించగలరు. "మనింట్లో రేడియోవుంటే బాగుండును" అని ఆశిస్తారు.

మద్రాసు రేడియో కేంద్రం వారు ఊటీకిసలపని కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడం కొంత తేలికపనే కావచ్చు. ఏర్పాటు చేసిన కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించడం అంత సులభంగాదు. సేవను డైరెక్టరు ప్రతిభకు, సామర్థ్యానికి యీ కార్యక్రమ నిర్ణయ నిర్వహణలు గీటురాళ్లు.

* * *

ఆదివారంనాడు మద్రాసు మ్యూజియం థియేటరులో "కృష్ణతులాభారం" నాటకాన్ని ప్రదర్శించారు. అక్కడ చేరినవారికిది "దృశ్య నాటకం", రేడియోలో విన్నవారికి "శ్రవ్యనాటకం" నాటకం గంటన్నర జరిగింది. రేడియో నాటకాల నిర్వహణలో ఇదిమనదేశంలో కొత్తపద్ధతి. ప్రత్యక్షంగా నాటకాన్ని చూస్తున్నవారు, రేడియోద్వారా ఆదేసమయంలో ఇంట్లో కూర్చుని వింటున్నవారూ దేశంలో ఏర్పడనున్న "టెలివిజన్‌కు ఇదినాంది" అని అనుకున్నారు.

"కృష్ణతులాభారం" ఆంధ్ర ప్రజల ఆదరణను విశేషంగాపొందిన నాటకం. పాండవోద్యోగ విజయాలు, చిత్రనళీయం, సారంగధర, చింతామణి, కన్యాశుల్కం లాగానే యీ నాటకంలోని సంభాషణలు, పద్యాలు కంఠతా రానివారు ఆంధ్ర నాటక ప్రేక్షకులలో ఉండరనడం అతిశయోక్తి కాదు.

ఈ నాటకాన్ని రసభంగం కాకుండా, పట్టుతప్పకుండా గంటన్నరలో ప్రదర్శించడం కష్టమే. ముఖ్యమయిన ఘట్టాలను వదలలేదు. పద్యాలను వదలలేదు. సంభాషణలను కొంత సంస్కరించి యుండవచ్చునేమో. నాటకం రక్తికట్టింది. మ్యూజియం థియేటరులో నాటకం చూచినవారు, రేడియోలో నాటకం విన్నవారు "బాగుంది" అనుకున్నారు.

నాటకంలో నారదపాత్ర చాలా ప్రధానమే అయినా రేడియో నాటకంలో ఆ ప్రాధాన్యాన్ని కనబరుస్తూ, పాత్ర పోషణకు భంగం కలగకుండా మరికొంత తగ్గించి యుండవచ్చును. అప్పుడు నాటకంలోని మరికొన్ని పాటలను పద్యాలను చేర్చడానికి వీలయ్యేది. "సలలిత మురళీ నినాదమే యిది సందేహమేలా" లాంటి పద్యాలను వదలవలసిన అవసరం వుండేదికాదు!

నాటకాన్ని గంటన్నరకు కుదించటప్పుడు కొన్నింటిని వదలి వేయక తప్పదు! అయినా జనరంజకమైన నాటకాలను ప్రదర్శించేటప్పుడు కత్తిరింపుల విషయంలో కొంత పూర్వాపరసుధకం కూడా వుండాలి.

సత్య పాత్రను శ్రీమతి సంధ్యకుమలబాయి, నారదపాత్రధారిట. రామకృష్ణశాస్త్రి, కృష్ణుడు మాధవపెద్ది సత్యం, వసంతకుడు బంగర వెంకటసుబ్బయ్య బాగా చేశారు. నాటకాన్ని కుదించడంలో రుక్మిణిపాత్రకు కొంత అన్యాయం జరిగింది. అందువల్ల రుక్మిణిపాత్రధారిణి అంతగా మెప్పించ లేకపోయింది.

రేడియోవారు ఈ కొత్త పద్ధతినిఅనుసరించి శ్రోతలకు రేడియో కార్యక్రమాల్లో ఎక్కువ శ్రద్ధాసక్తులను కల్పిస్తుంది. ఆదివారం మ్యూజియం థియేటరుకు వచ్చిన శ్రోతలు ఈ విషయాన్ని నిరూపించారు.

ఈ కార్యక్రమాన్ని సంకల్పించి, జయప్రదంగా నిర్వహిస్తున్న మద్రాసు రేడియో కేంద్రంవారూ అభినందనీయులు. వీరి కృషి ఫలప్రదమగు గాక!

# ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితి సమీక్ష

[ఆంధ్రపత్రిక విలేఖరి]

ఆంధ్ర ప్రభుత్వానికి ఈ సంవత్సరం తాము చెప్పిన కార్యక్రమాలను నడపాలంటే, రూ. 390. లక్షలు అదనంగా కావల్సి ఉంటుంది.

ఈ సంవత్సరపు బడ్జెట్టు ప్రవేశపెడ్తూ ఆర్థికమంత్రి రూ. 290 లక్షల లోటు వస్తుందని, ఇందులో ఒకకోటి రూపాయలను కొన్ని పన్నుల పెంపకం ద్వారా వచ్చే ఆదాయంతో భర్తీ చెయ సంకల్పించామని చెప్పారు. కానీ, ఆ పన్నుల పెంపకం జరిగే వాతావరణం గోచరించటం లేదు. అథవా జరిగినా, ఆ కోటిరూపాయలు ఈ ఏడు వసూలు కావు.

కాబట్టి ఆంధ్ర ప్రభుత్వం కేంద్ర సహాయం పైన ఆధారపడక తప్పదు.

సంవత్సర పరిపాలనలో ఆంధ్ర ఆర్థికశాఖ ఉండీలేనట్లే అయిపోయింది పాత నిబంధనలు ఆచారాలు పనికి రాకుండా పోయాయి. కొత్తవి సృష్టి కాలేదు. ఫలితం - ఆదాయ వ్యయాల తీరుతెన్నులు చేతులు తప్పిపోతున్నాయి.

పూర్వం కేటాయించబడిన ధనం ఖర్చు కాకపోతే అందుకు సంబంధించిన శాఖకు తగిన వివరణలు ఇచ్చుకోవాల్సిన బాధ్యత తగిలేది. ఆంధ్ర ప్రభుత్వంలో నిర్దిష్ట కార్యక్రమ ప్రకారం ఖర్చు నడవటం లేదు. జరిగే ఖర్చులకు ఒక సమర్థనా కనపడటం లేదు.

ఒక ఖర్చు చేయటమా చేయక పోవటమా అనే విచారణవచ్చినప్పుడు, ఈ ఖర్చు ఇట్లా జరిగితే, ఇలాటి ఇతర ఖర్చులనన్నింటినీకూడా చేయాల్సిందే అనేదే ముఖ్య సూత్రంగా పరిణమించింది.

### గత సంవత్సరపు ఆదాయం లోటు

గత సంవత్సరం ఆరునెలల బడ్జెట్‌లో రూ. 51 లక్షల లోటుంటుందని ఆర్థిక మంత్రి చెప్పారు. కాని లోటు తీరా రూ. 105 లక్షలయింది. అమ్మకపు పన్నులో రూ. 23 లక్షలు, అడవులపై రూ. 5 లక్షలు, చేనేత నిధి నుంచి రాని ధనం ... అంతా కలిపి రూ. 105 లక్షల లోటు అయింది. ఇందులో ఇతర ఖర్చుల్లో పెరిగిన రూ. 4 లక్షలు కూడా కలిసి ఉంది.

### గత సంవత్సరపు మిగుల్లు

అయితే గత ఆరునెలల బడ్జెట్టులోని ఖర్చు కార్యక్రమంలో కేటాయింపులు పూర్తిగా వినియోగం కాలేదు. ఎలెక్ట్రిసిటీ నిర్మాణాలకు కేటాయించిన రూ 33149000 లో రూ 17122000 మాత్రమే ఖర్చుఅయింది. భవననిర్మాణాలకు కేటాయించిన రూ. 5798000 లో రూ. 3411000 మాత్రమే వినియోగమయింది. నీటి సదుపాయాలకు ప్రత్యేకించిన రూ. 15371000 లో రూ. 11808000 మాత్రం ఖర్చుఅయింది. చౌకరకు ధాన్యం అమ్మకంపైన వస్తుందనుకున్న ధనంలో రూ 20 లక్షలకు పైగా తక్కువ లభించింది. కమ్యూనిటీ ప్రాజెక్టులపైన రూ 30.69 లక్షలు ... [illegible] లక్షలే ఖర్చు అయింది.

ఈకేటాయింపుల్లో కేటుబడిఖాతాకు ఖర్చుగాక మిగులుబడిపోయిన ధనం దాదాపు రు. 24 లక్షలున్నది.

### ఆర్థిక సంవత్సరాదిని నిలవలు

ఆంధ్రరాష్ట్రానికిమద్రాసురాష్ట్రం గత ఆర్థిక సంవత్సరంలో వసూలుచేసిన ఋణంలో రూ 2.5కోట్లు లభించింది. అదిగాక గత ఆర్థిక సంవత్సరంలో నిర్మాణాలకని వ్యవసాయదార్లకు స్థానికసంస్థలకు ఋణాలివ్వాలని, ఆంధ్రప్రభుత్వం కేంద్రంనుంచి రూ 875 లక్షలు అప్పుతీసుకుంది. ఈఅప్పుగా తీసుకున్న ధనం ఖర్చుకాలేదు. అందువల్ల ఈ ఆర్థిక సంవత్సరాన్ని మంచినిలువతోనే ప్రారంభించారు.

### ఖర్చు కార్యక్రమం

ఈ ఆర్థిక సంవత్సరంలో అంచనా వేయబడిన రూ 2102 81 లక్షల ఆదాయంలో కేంద్రంనుంచి ఆదాయపు పన్ను ఎక్సైజు పన్నులలో భాగంగా రూ 426.96 లక్షలు, గ్రాంటుల రూపంలో రూ 126 28 లక్షలు వస్తుంది. అంటే నాలుగోవంతుకు పైగా కేంద్రంనుంచి లభిస్తుంది. ఈ ఆర్థిక సంవత్సరపు ఖర్చు అంచనా రూ 2401.99 లక్షలు. ఇందులో జాతియాభివృద్ధి కార్యక్రమాలకు (నీటిపారుదలలు, విద్య, వైద్యం, ఆరోగ్యం వ్యవసాయం, పశురక్షణ, సహకారం, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, కమ్యూనిటీ ప్రాజెక్టులు) రూ 1129.47 లక్షలు కేటాయించబడింది. ఆదాయం ఇచ్చే శాఖల పరిపాలనకు రూ 233.19 లక్షలు న్యాయ, పోలీసు వగైరా శాఖలక్రింద రూ 1039.33 లక్షలు కేటాయించబడింది.

కాపిటల్ ఖర్చులకునాను ఈ సంవత్సరం రూ 1018.85 లక్షలు (లేక రూ. 10.19 కోట్లు) ప్రత్యేకించారు. ఇది గాక రూ 203.50 లక్షలు (లేక రూ. 2.04 కోట్లు) వ్యవసాయదార్లకు, స్థానికసంస్థలకు, సహకార సంస్థలకు ఋణాలివ్వడానికి కూడా కేటాయించారు. ఈ రెండుమొత్తాలలో, మొదటి మొత్తంలో రూ 9 07 కోట్లు, రెండో మొత్తంలో రూ 55,15 లక్షలు పంచవర్ష ప్రణాళిక క్రింద ఖర్చుఅవుతుంది. విద్యుచ్ఛక్తి, నీటి పారుదల ఖర్చు కార్యక్రమమంతా పంచవర్ష ప్రణాళికలో చేర్చారు.

అనుకున్న రూ 2.99 కోట్లలోటును ఈ కేపిటల్ ఖర్చు మొత్తానికి కలుపుతే రూ 15.21 కోట్లు అవుతుంది.

### అప్పులు

కేంద్ర ప్రభుత్వం ఈ ఏడు రూ 9 కోట్లు అప్పు ఇస్తారని ఆశింపబడుతోంది. (క్రిందటి ఏడు రాష్ట్ర) ప్రభుత్వం ఇచ్చిన అప్పులు వస్తాయని ... [illegible] రూ 10. కోట్లు ... [illegible] రూ 10 05 కోట్లు అవుతుంది.

అంటే రూ 15.51 కోట్లలో రూ. 10.05 కోట్లు లభించు తున్నదనుకుంటే మిగిలిన రూ 5.46 కోట్లలోకం ... దాం. మిగిలిన రూ 5.46 కోట్లలోకం యుక్తించాలి. గతసంవత్సరం కేంద్రం నుంచి తీసుకొని, పడ్డీ కట్టుతూ నిరుపయోగంగాయుంచిన రూ 875 లక్షలలో కొంతభాగం, ఈ రూ 5.46 కోట్ల అవసరంలో కొంత తీరుస్తుంది. మిగిలిన ధనం కేంద్ర సహాయంగా లభించాలి. ఇది దాదాపు రూ. 3.95 కోట్లవుతుంది.

### లోటు తీరదా?

మద్రాసు రాష్ట్రంలో పంచవర్ష ప్రణాళిక రూ. 141 కోట్లవుతుం దని అంచనా వేయబడింది. ఆంధ్రరాష్ట్ర భాగానికి రూ. 51 కోట్లవుతుంది. దీనికి మచ్‌కుండ్, తుంగభద్ర విద్యుదుత్పత్తి నిర్మాణాల ఖర్చు చేరిస్తే, రూ. 59 కోట్లవుతుంది. ఇదిగాక కృష్ణా ప్రాంతపు నీటి వనరుల నిర్మాణానికి గాను కేంద్రమిచ్చిన రూ. 5 కోట్లు చేరిస్తే రూ. 64 కోట్లవుతుంది. లెక్క వేస్తే......(చాలా లెక్కలు ఇంకా మద్రాసునుంచి రావాలి)...1953-54 అంతానికి రూ. 36 కోట్లు ఖర్చుఅయి ఉంటుంది. ప్రణాళిక క్రింద ఇంకో రూ. 28 కోట్ల ఖర్చు కార్యక్రమం మిగిలిన ఈ రెండు ఏళ్ళలోనూ నడవాలి. అంటే ఈఏడు రూ. 14 కోట్లు ఖర్చు కావాలి. ఈ రూ. 14 కోట్లూ ఖర్చు కావాలంటే రూ. 3,90 కోట్ల లోటు కనపడుతోంది. నీటి తీరువను పెంచి,వాణిజ్యపు పంటలపై పన్నును హెచ్చుచేసి, అభివృద్ధిచెందే భూముల పైన విరాళాలు వసూలుచేసి, అమ్మకం పన్ను రంగాన్ని విస్తృతంచేసి, ఒక కోటిరూపాయలను అదనంగా వసూలు చేయ్యవచ్చునని ఆర్థికమంత్రి ఈఆర్థిక సంవత్సరాదిలో ప్రకటించారు. ఈ కోటి రూపాయలు ఈ ఏడురావు. వచ్చే సంవత్సరం కూడా ఈ లోటు తప్పదు.

ఆర్థిక మంత్రి ఈ లోగా అనేక కట్టుదిట్టాలు చేసుకోవచ్చు. ఖర్చులు సరిగా జరుగుతున్నవో లేదో బాగా పరిశీలించే ఏర్పాట్లు చేయవచ్చు.

ఇంతకంటె బాగా, ఆర్థికపరిపాలన చేయవచ్చునని ఆర్థికమంత్రి అంగీకరించాలి. ఈ లోగా పన్నుల విచారణ సంఘ సిఫార్సులు ఏమైనా వుపకరిస్తవేమో అని ఆశిస్తూ ఉండాలి.

# మానెగింజలు, ధాన్యం, పత్తి ఉత్పత్తిలో లక్ష్యసిద్ధి

## పంచవర్ష ప్రణాళిక మొదటి మూడేళ్లలో సాధించిన అభివృద్ధి వివరాలు

న్యూఢిల్లీ, అక్టోబరు 4: ఆహారధాన్యాల ఉత్పత్తి, ప్రత్తి, మానెగింజల ఉత్పత్తి పంచవర్షప్రణాళిక లక్ష్యాలను అందుకున్నవి; లేదా దాదాపు అందుకున్నవి. జనపనార, చక్కెర ఉత్పత్తి మాత్రము లక్ష్యానికి కొరవడ వున్నది. మొదటి పంచవర్ష ప్రణాళికాభివృద్ధి నివేదికవల్ల ఈవిషయం వెల్లడి అవుతున్నది.

1949-50 లో పండిన ఆహార ధాన్యాలకంటే 114 లక్షల టన్నులు అధికంగా 1953-54 లో పండినవి. అనగా 5 ఏళ్లలో 76 లక్షల టన్నులను అధికంగా పండించాలని లక్షించివుండగా ఈలక్ష్యానికి మించి 38 లక్షల టన్నులు అధికంగా పండినవి.

ఆహారధాన్యాల ఉత్పత్తి ఈవిధంగా పెరగడంవల్ల దిగుమతులపై మన ఆశ్రయము తగ్గడమేగాక 130 కోట్ల రూపాయల విదేశీమారక ద్రవ్యంగూడా ఆదాఅయింది. వర్తమానసంవత్సరంలో దిగుమతి చేసుకునే దాదాపు 20 లక్షల టన్నులను నిల్వలను నిర్మించడానికి ఉపయోగిస్తారు.

ఆహారపరిస్థితి చక్కబడడంవల్ల, తిండిగింజల, కాయధాన్యాల ధరకూడా తగ్గింది. ఈప్రణాళిక కార్యక్రమ ప్రారంభసమయమున వీటిధరలు ఆందోళన కలిగిస్తూవుండెను.

పత్తిఉత్పత్తి ప్రాతిపదిక సంవత్సరమైన 1950-51 కంటె దాదాపు 10 లక్షలబేళ్లు, పెరిగింది. అనగా పంచవర్ష లక్ష్యంలో దాదాపు 100 కి 80 వంతులు ప్రణాళిక మూడవసంవత్సరంలోనే చేకూరింది. ఈహెచ్చు ఉత్పత్తిలో సగము ఎక్కువమేరలో పత్తి వేయడంవల్ల చేకూరింది. గత నాలుగేళ్లలో పత్తి సాగులోవున్న భూమి 146 లక్షల ఎకరాలనుంచి 170 లక్షల ఎకరాలకు పెరిగింది. అనగా 100 కి 17 వంతులు పెరిగింది.

పొడుగు రేకా పత్తింకొల ఉత్పత్తి కూడా క్రమంగా పెరిగింది. 1953-54 లో పెరిగిన ఉత్పత్తి అంతటికీ కారణము ఈ పొడుగు రేకాపత్తే. పత్తిఉత్పత్తి హెచ్చడంవల్ల 48 కోట్లరూపాయల విదేశీ మారకద్రవ్యం మనకు ఆదాఅయింది. ఇంక మానెగింజల విషయమున 5 ఏళ్లకూ అదనపు ఉత్పత్తి లక్ష్యం 4 లక్షల టన్నులు 1953-54 లో 1950-51 లో 50 లక్షల 70 వేల టన్నుల మానెగింజలు ఉత్పత్తి అయ్యినవి. ప్రణాళిక మొదటి రెండేళ్లలో తక్కువగా వుండిన మానెగింజల ఉత్పత్తి 1953-54 లో 56 లక్షల టన్నులకు పెరిగింది 5 ఏళ్ల లక్ష్యాన్నే యిది మించింది. పైన పేర్కొన్న మూడు శాఖలలో ఉత్పత్తి ఆశాజనకంగా వుండగా జనపనార ఉత్పత్తి, జనపనార వేసేపొలాల విస్తీర్ణము రెండు తగ్గాయి. వరదలు, తెగుళ్లు యిందుకు కొంతకారణమైనా ధరతగ్గడమే ముఖ్యకారణము. విభజనవల్ల జనపనార వ్యవస్థ చితికిపోయింది. 20 లక్షల 90 వేల బేళ్లు ఉత్పత్తి హెచ్చించాలని ప్రణాళిక లక్షించింది. ఇందుకు అనేకచర్యలు తీసుకున్నారు. ఈ చర్యలను అమలు చేయడానికి రాష్ట్రీయ ప్రభుత్వాలకు 50 లక్షల రూపాయలు కేటాయించారు. తరువాత ఈ మొత్తాన్ని 80 లక్షలకు పెంచారు. మొదటి మూడేళ్లలో యిందుకు 34 లక్షల రూపాయలు ఖర్చయినవి. ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో ఉత్పత్తి 18 లక్షల బేళ్ళనుండి 14 లక్షల బేళ్ళకు పెరిగింది. కాని 1953-54 లో దాదాపు 15 లక్షల బేళ్లు తగ్గింది.

### చక్కెర

ఇంక చక్కెరవిషయంలో, ప్రణాళిక కార్యక్రమం ప్రారంభమైన సంవత్సరంలో చక్కెరకు హెచ్చు ధరయివ్వడం వల్ల ఉత్పత్తి, చెరుకుగడ సాగులో వున్న మేర రెండు పెరిగాయి పలుకుల చక్కెర ఉత్పత్తి అపూర్వమైనదిగా వుండెను. అనగా 15 లక్షల టన్నులు ఉత్పత్తి అయింది. చక్కెర ధర తగ్గించడంవల్ల ఉత్పత్తి తగ్గింది. చెరుకుగడ వేసే పొలాల విస్తీర్ణం కూడా తగ్గింది. ప్రాతిపదిక సంవత్సరం (1950-51) ఉత్పత్తి కంటె 1953-54 ఉత్పత్తి తక్కువగా వున్నది.

### వ్యవసాయ కార్యక్రమాలకు ఋణాలు

వ్యవసాయ కార్యక్రమాల నిమిత్తం కేంద్రం రాష్ట్రాలకు కేటాయించిన 120 కోట్ల రూపాయలలో ఇంతవరకు 59 కోట్ల రూపాయలు ఖర్చయినవని నివేదిక తెలుపుతున్నది. 'ఏ' తరగతి రాష్ట్రాలు 100 కి 49 వంతులు 'బి', 'సి' రాష్ట్రాలు 100 కి 40 వంతులు ఖర్చు చేశాయి. 'ఏ' తరగతి రాష్ట్రాలన్నీ ఖర్చు చేయదలచిన దానిలో దాదాపు సగమో లేక కొంచెం ఎక్కువో ఖర్చు చేశాయి. తిరువాన్కూరు-కొచ్చి మాత్రము 100 కి 20 వంతుల కంటె కూడా తక్కువే ఖర్చుచేసింది.

గత మూడేళ్లలో నిర్మించిన మైనర్ యిరిగేషను స్కీముల ఫలితంగా దాదాపు 58 లక్షల ఎకరాలు ఇరిగేషను క్రిందికి వచ్చినవని లేదా వస్తవని అంచనా వేస్తున్నారు. 5 ఏళ్లలో 112 లక్షల ఎకరాలకు నీటి సదుపాయాలు కల్పించడం లక్ష్యమైవున్నది.

వ్యవసాయకులకు ద్రవ్య సహాయం చేసే విషయమున కూడా అభివృద్ధి పొడసూపింది. వ్యవసాయ పరపతి సంఘాలు యిచ్చిన స్వల్ప వాయిదా ఋణాలు 1949-50 లో 28 కోట్ల 53 లక్షల రూపాయలుగా వుండగా 1951-52 లో 37 కోట్ల 65 లక్షలుగా వుండెను. వ్యవసాయకులకు యిస్తున్న ఋణాలు అప్పటికంటె కూడా పెరిగాయని రాష్ట్రాలనుండి వార్తలువస్తున్నవి. రిజర్వు బ్యాంకువారి లెక్కలు కూడా ఈ విషయాన్నే ధృవపరుస్తున్నవి.

1951-52, 1952-53 లలో రిజర్వు బ్యాంకు సంవత్సరానికి దాదాపు 12 కోట్ల రూపాయలను 8 రాష్ట్రీయ కో-ఆపరేటివ్ బ్యాంకులకు అప్పులుగా యిచ్చివుండగా 1953-54 లో 14 కోట్ల 70 లక్షలు పైచిలుకు యిచ్చింది.

రయితులకు న్యాయమైనధర వచ్చేటందుకుగాను క్రమబద్ధం చేయబడిన మార్కెట్ల సంఖ్యకూడా పెరిగింది.

... [illegible] గ్రామాలకు ఒక కేంద్రాన్ని ఏర్పరచి

(7 వ పేజీ చూడుడు)

## వరద బాధితులకు పోలెండు సహాయం

న్యూఢిల్లీ, అక్టోబరు 4: ఢిల్లీలోని పోలెండు రాయబారి భారత విదేశాంగ శాఖ డిప్యూటీ మంత్రి శ్రీ అనిల్, కె. చాందాను కలుసుకొని వరదబాధితుల సహాయార్థం తమ ప్రభుత్వం తరఫున 50 వేల రూపాయలు విరాళం ఇచ్చారు.

## గ్రామం దోపిడి: పాకిస్తానీల దుండగం

... [illegible] అక్టోబరు 1. ... [illegible] లో పాకిస్తానీలు సరిహద్దు భారతదేశం సరిహద్దులను అతిక్రమించి ... [illegible] గ్రామంలో దోపిడీచేశారు.

